## హైందవ ధర్మపోలీలు

# బలభద్రుడు

ఇతని దివ్యచరిత్ర ౧౨౦ ఏండ్లక్రిందటిది. రంగము నేపాళదేశము. శత్రువులు శశన్నకౌ యుక్తులను, దేశీయ ద్రోహిరాజ సహాయము గలవారు, అపార సేనాద్రవ్య లక్ష్మీకటాక్ష లాళితులను అగు—బ్రిటిషువారు.

హేస్టింగ్సు గవర్నరు జనరలు క్రీ.శ. ౧౮౧౪ వ ఏటను హిందుస్థానమునకు దయ చేసిన వచ్చుటతోడనే నేపాళరాజ్యముపై దృష్టి సారించెను. ఏదోవిధముగా నేపాళ మహారాజుతో తగవులు కల్పించుకొని యుద్ధ ప్రకటనచేసెను. నాలిగవమారణ యంత్రయుక్తము ౩౦,౦౦౦ సైన్యమును ౬౦ తోపులను పంపెను. నేపాళమువారివద్ద ౧౨౦౦౦ సైన్యమే యుండెను, తోపులులేవు. యుద్ధసామగ్రికూడ సరిగాలేదు. దేశమంతయు పర్వతప్రాంతము. సరియగు బాటలులేవు. కొండరాళ్లే ముఖ్యమగు ఆయోగములు. అయినను ఇవేవారిని రక్షించినవి

గిల్లిస్పీసేనాని గొప్పసైన్యముతో డెహ్రాడూను నుండి నేపాలుప్రవేశించెను. సరిహద్దులోనే బలభద్రుడు అను నేపాళసేనాని ౬౦౦ గూర్ఖాలతో మాత్రమే స్వదేశ సంరక్షణము చేయుటకు సంసిద్ధుడయ్యెను. ఈగొప్ప ఇంగ్లీషుసైన్యముతో పోరాడుట కష్టమని తన "కలంగా" కోటలో నిలిచిపోయెను. బ్రిటిషుసేనాని అతనికిట్లు వార్త పంపెను. "తత్క్షణమే మాకు లొంగుము. లేకున్న నీకు సర్వనాశనమే" బలభద్రుడు తనజన్మములో ఓటమి యెరిగినవాడు కాడు. పిరికితనము ఒక వెంట్రుకలోనైన కొనరాదు. వృత్యువునకు వెరవడు. అట్టివానివలన ఏమి ప్రత్యుత్తరము దొరకును.

నిరాకరించెను. తుదకు ఒకనాడు బ్రిటిషువారు తోపులతో కాల్చికాల్చి కొన్నినిమిషములకై విరమించియుండిరి. ఆక్షణములో వారి కంటికొక యపూర్వదృశ్య మగుపడెను. కోటలోని కోటయొక్క లోహద్వారములను తెరచి పైది బలభద్రుడు తనమిగిలిన ౭౦ మంది భటులతో ఒక హస్తమందు కృపాణము ఒకహస్తమందు తుపాకి, తలపాగలలో చక్రమున్న దరించి "హరహరమహాదేవ్" అని భీకరముగా గర్జించి మెరుపు మెరసినట్లు బ్రిటిషుసైన్యము కన్నులకు మిరుమిట్లు గొలుపుచు వారిపైబడి సైన్యదళముల చీల్చి, చెండి, చంపి, చెదరగొట్టుచు ఒక్కరుకూడా చావకుండగా శత్రుసైన్యమును ఒకదిక్కునుండి యింకొకదిక్కు వరకు భేదించుకొనుచు అవతలికిపోయి అందరు చూచుచుండగనే పవిత్ర "వాలాపానీ" ఝరిలో తమ యెండినకంఠములను తడుపుకొనుచు కడుపార త్రాగి ఖడ్గముల లీలావిలాసముగాత్రిప్పుచు దాటుకొనివెళ్లిరి.

ఇంగ్లీషువారు అయినదేమి అయినదని కోటను గాంభీర్యముతో ప్రవేశించి పట్టుకొనిరి. కోటలో వారికి స్త్రీలశవములు, గాయములతో చచ్చిన వీరులశవములు లభించినవి. కోటను నేలమట్టము చేయుటలో తమ కసినంతయు తీర్చుకొనిరి.

నేటికిని డెహ్రాడూను సమీపమందలి నిర్ఝరిణములలో, "రీచ్పనా" నదీతీరమున "మాయొక్క వీరశత్రువగు బలభద్రసింహుని జ్ఞాపకార్థము" అని చిన్నచిహ్నము నిర్మింపబడినది.

## సురవరం ప్రతాపరెడ్డిగారు

"యుద్ధరంగములోనే నీకు సరియగు జవాబు దొరకగలదు"

అని స్వాతంత్ర్యాయముగా ప్రతివార్త సంపెను బ్రిటిషువారికి అతని బిరుసుదనముపై కోప మినుమడించెను. కోటను నాలుగుదిక్కుల ముట్టడించిరి. ఫిరంగులు ఘోరముగా ప్రయోగింపబడెను. కోటగోడలు కూలిపడుచున్నవి. కోటలోనివారు కొందరుచచ్చిరి. ౬౦౦ మంది ౨౦౦ మంది అయిరి. అయినను బలభద్రుడు క్షణక్షణము వీరభద్రుడగుచు వచ్చెను.

గిల్లిస్పీసేనానికి వీరిపట్టుదలపై ఆగ్రహము కలిగెను. కోటగోడల నెగబ్రాకుటకై సైన్యమును ప్రోత్సహించెను. ఈప్రయత్నములో కోటనుండి వెడలిన ఒక తుపాకీగుండు గిల్లిస్పీ ఎదనుచీల్చుకొని వీపున వెడలివచ్చెను. వెంటనే అతడు గిజగిజ తన్నుకొని చచ్చిపడెను. "కర్నల్ మాబే" సేనానియయ్యెను. మరింత తీవ్రముగా ముట్టడిసాగించెను. గూర్ఖాలలో స్త్రీలుకూడ నుండిరి. వారు శక్తిరూపిణులై కొండగుండ్లను బ్రిటిషుసేనపై దొర్లించుచు బ్రిటిషువారి తుపాకీగుండ్లకు గురియై సూర్యమండలము భేదించుకొని పోవుచుండిరి. "మాబే" దొరకు విస్మయమయ్యెను. నెలదినములైనను కోట వశము కాకపోయెను. సుమారు ౧౦౦౦ సైనికులు హతమైరి. కోటను సమీపించుట యముని వేడుకొనుటయే! "ఈయున్నతమైన కోటలో త్రాగుటకై నీళ్లెక్కడివి" అను నాలోచన బ్రిటిషు సేనానికి స్ఫురించెను. వెంటనే పరిశోధన మొదలయ్యెను. బ్రిటిషువారి సైన్యములుండుచోటనే "నాలాపానీ" అను కొండకాలువనుండియే కోటలోనివారికి నీరు దొరకుచుండినట్లు కనుగొనబడెను. ఆకాలువకు అడ్డముగా కట్టకట్టి నీటిసాపివేసిరి. బలభద్రుని సైన్యమునకు భోజనపదార్థములు మొదలే తక్కువైయుండెను. ఇప్పుడు నీరుకూడ బొత్తిగా లేకపోయెను. ౨౦౦ మందిలో ఇప్పుడు ౭౦ మందిమాత్రమే మిగిలియుండిరి. అప్పుడును బలభద్రుడు శత్రుశరణు జొచ్చుట

"ధర్మపోలీ"లో లియోనిదాసు జగద్విఖ్యాతిపొందెను. అతనినిమించిన బలభద్రుని ఎవ్వరును ఎరుగరు?" అని మోతీలాఘోషుగారు ౩౪ ఏండ్లక్రిందట వ్రాసినవాక్యములు ఇప్పుడుకూడ సత్యమే! విద్యావంతులలోనైనను ఇండియనులెందరు ఈ అభినవ భీముని ఎరుగుదురు! ఏహిందూదేశ చరిత్రలోనైన విద్యార్థులకీ కథ యెవ్వరైన వ్రాసి చదివించిరా! తుదకు హిందువులలోనైనా ఎందరెరుగుదురీ హిందూ వీరాతివీరుని దివ్యచరిత్రము?

### నిర్భయచందు

౩౦౦ సంవత్సరములక్రిందట నాసీరుద్దీన్ అను పాదుషా ఢిల్లీరాజ్యము చేయుచుండెను. అతనికాలములో రాజపుత్రస్థానములోనుండు "అర్గళ" అను ఒకచిన్న సంస్థానమును పాలించు గౌతముడనురాజు పాదుషాకు కప్పముకట్టుటకు నిరాకరించి తిరుగబడెను. అర్గళరాజుకు బుద్ధిచెప్పుటకు ఔద్కు సుబేదారును గొప్పసైన్యముతో యుద్ధమునకు పంపెను. కాని అర్గళరాజు విజృంభించి సుబేదారుసైన్యములో ౧౦౦౦౦ సైనికులను చంపి సుబేదారును పారగొట్టెను.

ఇట్లుండ ఒకనాడు పూర్ణిమా పర్వమగుటచే ఆచారప్రకారము అర్గళరాణికి గంగాస్నానమవసరమనిపించెను, కాని గంగాతీరము ఔద్ సుబేదారు వశములోనుండెను. రాజాగారికి సంగతిచెప్పిన అంగీకరించరని అతనికి తెలుపకయే రాణిగారు కొందరి పరిచారికలతో రాత్రి యంతయునడిచి తెల్లవార గంగాభవానిని దర్శించికొని అందు స్నానము చేయుచుండెను.

రాణి అందరి స్త్రీలవలె లేదు. వజ్రాలనగలు ధరించి విలువగల బట్టలు కట్టియుండెను. సంకల్పముచెప్పు బ్రాహ్మణుకు భూరిదానములిచ్చెను. పరిచారికల సందడిని యీపాటాటోపమంతయు ను ఔద్ చారులకు వింతగాతోచెను. తమ

చారచక్షువు వంతయు వినియోగించి ఆమె అర్గళరాణి యనుసంగతిని గుర్తించిరి. సూబేదారువార్తను గృహపరచుకొనుటకై తనకూతుంద్రనిద్దరను పంపెను వారారాణితో ముచ్చట్లుపెట్టుచు మెల్లమెల్లగా రహస్యమును లాగికొని ఆమె అర్గళరాణియేయని తమతండ్రికెరిగించిరి.

తన పరాభవమునకు ప్రతీకారము చేయ మంచి అవకాశము దొరికెదాయని సూబేదారు హర్షించి ఆమెనుబంధించి యెత్తుకొనిపోవుటకై స్వయముగా కొందరిభటులను వెంటతీసుకొని అర్గళరాణి స్నానముచేసి పూజలు ముగించికొని తన రాజధానికి వెళ్లుటకై సిద్ధమగుచుండగా ఆమెను ముట్టడించిరి.

ఆనాటి రాజపుత్ర స్త్రీలకును ఈనాటి హార్యాడీ స్త్రీలకును హస్తమశకాంతర న్యాయము. ఆనాటిస్త్రీలు వీరాంగనలు. ఈనాటివారు పిరికిపందలు. ఆనాటిస్త్రీలు సాముచేసిన కర్కశశరీరలు. ఈనాటివారు తిండిసాముచే కొగులవలె పెంచుకొనిన పొట్టలుకలవారు. ఆనాటివారు శక్తిస్వరూపిణులు, ఈనాటివారు రక్తపాపకులు.

అర్గళరాణి తనచుట్టు భయంకరపఠానులు కత్తులు ఝళిపించుచు భయపెట్టుచుండినను కించిత్తుకూడ చలించక ఇట్లుపలికెను. "పిరికిపందలైన మీకు సిగ్గనలేదుకదా! మగవారితో పోరాడలేక పారివచ్చి ఆడువారిపై అందును నిస్సహాయలును, నిరాయుధలును నగువారిపై దర్పముచూప వచ్చిన మీముఖములపై ఉమ్మివేయువారలేరా!" సూబేదారుని కీమాటలు తేనెతెట్టునుండి కోపబడిన తేనెటీగలు కుట్టినట్లుగా శరీరమంతయు మంటలెత్తించెను. సిగ్గుపడుటకుమారుగా క్రుద్ధుడయ్యెను. "దీనినిపట్టుడు! పట్టుడు!" అని భటుల కాజ్ఞయిచ్చెను. భటులు చకితులై ఆందోళన పడుచుండగా రాణి మరల యిట్లుపలికెను. "నేను రాజపుత్రస్త్రీని. ఓటమి బొందిలో ప్రాణమున్నంతవరకెరుగనట్టి జాతికి చేరినదానను. ఏమీ! ఇచ్చట రాజపుత్రమాతను, రాజపుత్రసోదరీమణులను గౌరవించు సోదరులెవరైన కలరాలేరా?" ఈమాట లావీరనారీమణి నోటినుండి వెడలెనో లేదో, ఈసంవాదమునంతయు వెనుకనుండి పరీక్షించుచుండిన అభయచందు, నిర్భయచందు అను సోదరులు తటాలున చుట్టుమూగియున్న సంధ్యవారు చీల్చుకొని ఒకరుకరు కత్తులలాగి పఠానులపైబడిరి. వారిద్దరు పఠానులతో యుద్ధ

ముచేయుచుండగా వారి పరిచారకుడొకడు గుర్రముపై ప్రచండవేగముతో స్వారియగుచు అర్గళ రాజుకీవార్త తెలుపుటకుపోయెను. ఈ యిరువురును తమ యనుచరుల సహాయముతో ఘోరముగా పోరుచుండిరి. కొంతసేపటికి వీరి యనుచరులలో కొందరును నిర్భయచందును చనిపోయిరి. అభయచందున్ను, ముగ్గురునల్గురు అనుచరులును మిగిలియుండిరి. పఠానులు విజృంభించి వారిపైబడి ఇక కొన్నిక్షణములలో రాణి తమవశమగునని యుల్లాసపడుచుండిరి.

అట్టిసమయమున అర్గళరాజు స్వయముగా కొంత సిబ్బందితో రణభేరి మ్రోయించుచు పఠానులపైబడెను. పఠానులు దిగ్భ్రాంతులై పారిపోయిరి. రాణితోసహా, అభయచందుతోసహా అర్గళమునకు రాజుమరలెను. అభయచందు కుటములో తక్కువవాడైనను కృతజ్ఞతసూచకముగా రాజుతన బిడ్డనిచ్చి పెండ్లిచేసి "రావు" బిరుదమిచ్చి తనరాజ్యములో కొంతభాగము జాగీరుగానిచ్చి గౌరవించెను.

నసీరుద్దీను పాదుషాకు సుబేదారు చర్యలు తెలిసినతర్వాత వాని నగౌరవపరచి నౌకరీనుండి తొలగించెను. పెద్ద చిన్నలందరిలో సూబేదారు సైన్యమును ఖండించనివారు లేకుండిరి.

### తుదిమాట

హైందవ ధర్మపోలీలను శీర్షికతో వ్రాయుచుండిన చారిత్రిక ఘట్టములు ముగిసినవి. ఇట్టి ఘట్టములు మనదేశచరిత్రములో అనేకములు కలవు. పాశ్చాత్యులు పలుమారుదవారించి గర్వించునట్టి థర్మపోలీని మించినయుద్ధములు మనదేశమందు జరిగినవనియు, మనపూర్వులు గతశతాబ్దమువరకు అనగా బలభద్రునివరకును వీరాతివీరులై యుండిరనియు, నిరూపించుటకై కొన్ని ఐతిహాసిక విషయమును పాఠకులకు తెలుపుకొంటిని.

అనేక కారణములచే నిర్వీర్యులై పిరికివారై ధర్మచ్యుతులై దైనందిన దైన్యత నొందుచున్న హిందువులలో పూర్వ శౌర్య ధైర్య సాహసోత్సాహాది గుణములను పెంపొందించుటకై కవి కుమారులిట్టి ఘట్టములను కావ్యములుగా, గేయములుగా, నాటకములుగా రచించి సేవచేయుదురని కోరుచున్నాను.

సు. ప్ర.

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

# గోలకొండపత్రిక

Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 12 | HYDERABAD-DECCAN MoNday 4 October 1937 | Number 42



# యూరపు - ఇవేళ రేపు

## మరొక మహాసంగ్రామ సూచన

### ఇటలీ

ఇటీవల యూరపునందు కలిగిన కలవరము లన్నిటికి యుద్దేశము గమనించుటకు ఫాసిస్టు యిటలీ నాజీజర్మని ఆదర్శములు కనుగొనుట త్యావశ్యకము. ౧౯౨౨ సంవత్సరమున సీజార్ ముసోలిని అధిపత్యము వహించిన నాటినుండి యిటలీ బలవంతముగా విస్తరణ—పూర్వరక్షియందము—మునకై అనగా ప్రాచీన రోమక సామ్రాజ్య పునరుద్ధరణమునకై కంకణముధరించినది. కాని ౧౯౩౫ వరకే విస్తరణ మార్గమే పధమవలంబింప జేయునది యిటలీకే స్వయముగా తెలియకుండెడిది. డాల్ఫస్ షిషింగ్ తిర మహారిహారించిన జుగుస్లొవ్యాపై ప్రతీకారభావ మావేశించియుండెను. భూగోళరీత్యా యిటలీకి చెందియుండవలసిన కార్సికాద్వీపము, జనాభాలో అధిక సంఖ్యయందు యిటలీ ప్రజలుగల టునిస్యా, ఆఫ్రికాయందు ఉత్తరభాగమునగలదు, అధీనపరచుకొని, యిటలీ ప్రాంతములగు సవాయ్ నీసు లాక్రమించుకొనిన ఫ్రాంసుపై యిటలీ నిప్పులు గ్రక్కుచున్నది. ఇటలీ

ముసోలిని

“మాల్టా”పై అధిపత్యమేర్పరచుకొని ఫరాసువారి తంత్రముతో మధ్యధరాసముద్రమును బ్రిటిషు సరోవరముగా మార్చిన సామ్రాజ్యతత్వ బ్రిటనుతో శత్రుత్వముగలదు. ఇటలీ, ఫ్రాంసులమధ్య యేర్పడిన తీవ్రశత్రుత్వమువలన యుద్ధయుత్ప్రదేశముల సరిహద్దులు బలవత్తరముగా సంరక్షింప చేసుకొనుటకు అసంఖ్యాకములగు సైనికబృందము నిలువచేయబడినది. అకస్మాత్తుగా ౧౯౩౬లో నాజీయుగము రంగమునందు ప్రదర్శితమగుటచేసి యూరపురూపమే మార్పుచెందినది, రానున్న ఆపత్తును రక్షణము, సహాయముకై ఫ్రాంసు బ్రిటనువద్దకు పరిగెడెను. కాని బ్రిటను రొట్టెష్టరతుల సంగీకరించలేదు. ఖండమునందు ఫ్రాంసు అధిపత్యమునకొక యాటంకమేర్పడవలయునని బ్రిటిషు హృదయమునం దభిలషించి యుండవచ్చును. లేక తన ప్రాచీన ఆచారముల ననుసరించి యుండవచ్చును. ఫ్రాన్సు బ్రిటనునుండితిరిగి నిరాకాంక్షితయంమ తనమార్గమును యిటలీ, సోవియేటు రష్యాపై మరలించెను. ఇటలీ తనసైన్యశిబిరములను సరిహద్దులనుండి లేవదీసి జర్మనికి వ్యతిరేకముగా కమకూర్పవలయునని ఫ్రాంసు అభిలషించెను. ఇంతేగాదు జర్మనియొక్క ప్రాక్భాగమునందు ప్రత్యేకసఖ్యత నిర్ణయించుకొనుటకు విశదపరచెను. లావల్ ముసోలిని ఒడంబడికకు, ఫ్రాంకో సోవియేటు ఒడంబడికటుల వ్యక్తిత్వమేర్పడినది.

జనవరి ౧౯౩౫ నాటి లావల్‌ముసోలిని యొడంబడిక వలన యిటలీకి భావివిస్తరణ మార్గము నిర్ణయమైనది, ఆదివరకు ఫ్రాంసుతో యేర్పడియుండిన విభేదములు యిటలీ పరిష్కరించుకొనినది. యూరపుప్రాంతముల కోరిక తొలగించి వేసుకొనినది. ఆఫ్రికాఖండములో యిటలీకి స్వాతంత్ర మొసగెదనని ఫ్రాంసు యంగీకరించినది. అబిసీనియా దోపిడియే దీని ఫలితము.

అబిసీనియా విజయానంతరము ముసోలిని యిటలీ ‘సంతృప్తి’ అధిపత్యమని ప్రపంచమున కుపన్యాసముద్వారా విశదపరచెను. ఇటలీవారి అబిసీనియా ఆక్రమణమును బ్రిటను తనఆఫ్రికా సంరక్షణములందు చేసికొనుచున్నటుల గ్రహించెను. ఈయుపన్యాసము ఆంగ్లోయిటలియన్ స్నేహితమును తిరిగి దృఢపరచుటకు సూచించునటులగా నుండెను. కాని యీకోరిక నెరవేరలేదు. ఆరంభమున బ్రిటను అబిసీనియా సంబంధములో యిటలీకి సవాలుచేసినది. ముసోలిని బెదిరింపుల, ఆగణనీయ ప్రవర్తనవలన మానమువహించుటయే యుక్తమని నిశ్చయించెను. బ్రిటనీయుమానమును మరువలేదు. మధ్యధరాసముద్రము, సమీపప్రాచ్య జాతులందు తనకుకలిగిన యగౌరవ పరిహారార్థము మధ్యధరా సముద్రమునందు తననావిక, వైమానికకేంద్రములను శక్తివంతము చేయుటకు యారంభించెను. నావిక ప్రధమమంత్రియగు సర్ సామ్యూల్ హోరు మధ్యధరా సముద్రమునకు పదిలవార్తమేగి, నావికకేంద్రముల సందర్శించి బ్రిటను యీ ప్రాంతమును వదలజాలదని బహిరంగముగా ప్రకటించెను. పరిపాలనా రంగమందలి యితర మంత్రులు ఆన్తోనీయీడెన్ మధ్యధరా సముద్రము బ్రిటనుకు జీవనధారయనియు, సమీప మార్గమే గాక యిది వాస్తవికపధమని విశదపరచిరి. మధ్యధరా సముద్రమునందు తన అధిపత్యము స్థిరీకరింపజేయుటకు, శక్తివంతము చేయుటకు, ఇటలీకి సముద్రేకము కలిగించుటకు బ్రిటనుయొక్క యీ నిశ్చితాభిప్రాయమే ముఖ్యము. బ్రిటనుతన నావిక, వైమానిక ప్రభావము హెచ్చింపజేసి విస్తరింపజేయగలిగిన దీనిశ్చయమే! ఈఆదర్శము బ్రిటను గౌరవమునకు హానికలుగుటవలననే ఫలితమగును. నేడు యేర్పడిన ఆంగ్లో యిటాలియన్ స్పర్ధలు ముసోలినియొక్క దౌర్జన్యహాస్యము వలనగాని కలుగనున్న దానివలన గాని యేర్పడిన శత్రుత్వము తాత్కాలికమున దవచ్చును. ఈయుభయశక్తుల అధిపత్యము లందొకదానికి స్థిరరూపమున అపజయములేక యేలాటిషరతులేక వదలుకొనుటవలన మధ్యధరా సముద్రముపై భావి అధిపత్యసమస్య పరిష్కరింపబడు వరకే స్పర్ధలేర్పడి యుండుననుట నిశ్చయము. సీజార్ ముసోలిని, నెవిలీ చేంబర్లైన్ మధ్య పరస్పర స్నేహపూరిత ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండవచ్చును, ప్రతినిధులు విదేశాంగమంత్రులు భాతృత్వభావములు విశదపరచుకొనుచుండవచ్చును—ప్రతి ఫలాపేక్షయంగములు, బలము వలన యేర్పడిన యీరాజకీయ స్పర్ధలాకారణములు నుండువరకు పెంపొందుచుండుననుట నిక్కము.

హోర్

నెవిలీ చేంబర్లైన్

మధ్యధరాసముద్రమందలి బ్రిటను నూతన అభ్యుదయ ప్రత్యర్థముగా యిటలీ స్పెయిన్ గృహకల్లోలమునందు చేకలుగించుకొనినది. ఇటలీ ఫ్రాంకోయొక్క ఫాసిస్టు ఆదర్శముల సానుభూతికే సహాయాసుభవ నిరసనముగలవ ఫ్రాంకుతో సహాయకమైనదని యనుట లేక సూచించుట విరుద్ధకము. ఫ్రాంకోతో యేరూపమునందైనను రాజకీయ సానుభూతి యేర్పడి యుండెడిదే, కాని ఫ్రాంకుకొరకు తనధనమరక్తము, సైనిక సహాయోపకరణములనిచ్చి ప్రవహింప చేయుచున్నది. జర్మనీ సంబంధములో యిదియే యనుసరించును. ఈరహస్యము గ్రహించుకొనని వారికి, స్పెయిన్ గృహకల్లోలములు అవగాహనము కాజాలదు.

—

### సుభాషు చంద్రబోసు

రోజురోజు దృశ్యము మారుచున్నది. రాజకీయ జోశ్యములు సులభములుగావు. ఒకవిషయము నిశ్చయము. సమరమే సిద్ధించిన ‘వర్తమాన స్థితి’ గురించి జర్మనీసవాలుపై మధ్య పూర్వ యూరపునందు కలుగుట సంభవము. కాని సమరముజరుగునా? ప్రత్యుత్తరము ముఖ్యముగా బ్రిటిషుపై ఆధారపడియున్నది. జర్మని తిరిగి ౧౯౧౪ నాటి పొరబాటులను తిరిగిసలుపదు; సమరమునకు కాలుదూరదు. ముఖ్యముగా బ్రిటను తనకు వ్యతిరేకముగా నిలిచినదని తెలిసిన. ౧౯౧౪ లో మాదిరి బ్రిటను సమరరంగమున ప్రవేశించిలేదని విశదమైన సమరమున శాకర్షింప బడవచ్చును. మధ్యశేక పూర్వయూరపు సమరమునందు బ్రిటను, ఫ్రాంసు తటస్థులుగా నుండుటకేకమైన, ప్రాక్దిశయందు భానోదయమగునటుల యూరపునందు సమరమారంభమగుట నిశ్చయము. ఫ్రాంసు ఒకవేళ సోవియేటు రష్యాతో నేకమైన, బ్రిటను తటస్థభావము వహించిన సంగ్రామమేర్పడుట నిశ్చయము. ఫలితము సందేహాస్పదము.

ప్రస్తుతము రెండు దృశ్యములు—స్పేన్, బాల్కన్స్—పరిశీలించుచుండు టత్యవసరము. జనరల్‌ఫ్రాంకో జయమొందిన యీజయము ఇటలీ, జర్మనీది; అనగా మధ్యధరాసముద్రమునందు బ్రిటను ఆధిపత్యాంతము. ఖండమునందే సమరమారంభమైన ఫ్రాంసునకు దుష్కాలమాసన్నమగుననుట నిక్కము.

బాల్కన్సులో, చెకోస్లొవాక్యానుండి రుమానియా, జుగోస్లావియా విడదీయుటయందు జర్మని జయమొందిన, యుద్ధరూపమున ౭౨ గంటల వ్యవధిలో ప్రేగును ఆక్రమించుకొని కొంతకాలమునకు చెకోస్లొవాక్యాను లోబరచుకొనును. కాని అగహనసమస్య—రష్యా—అటులే నిలిచిపోవును. తరుచుగా రష్యా కొలాసస్‌గూడ ప్రశ్నగనే ఫలించినది. ఇది నెపోలియన్—యూరపు విజయ—ను కలవరపరచినది. హిట్లరును కలతజెందించునా?

“మాడరన్ రెవ్యూ” యందు పైశీర్షికక్రింద విశదపరచిన శ్రీ సుభాషుచంద్రబోసుగారి అమూల్యభావములు, నేను యూరపు ఖండమును ఆవరించియున్న క్లిష్ట రాజకీయ పరిస్థితులు గమనించుచున్న పత్రికాపాఠకుల రాజకీయ పరిజ్ఞానార్థ మాంధ్రీకరింప బడినవి—శర్మ.

—

# బొంబాయిలో నానాదేశములకు కుస్తీల పోటీ

## భారతదేశమునకు, గామాగారికిని సవాలు!

బొంబాయిలో కలకత్తా వాస్తవ్యులగు మార్టిరోస్ మార్టిన్ గారి ద్రవ్యసహాయముతో రష్యానియాలో గొప్ప కుస్తీప్రవీణుడును, ప్రఖ్యాతిగాంచిన భారతీయ కుస్తీనిపుణుడగు గంగాను ఓడించిన క్రేమర్ అను జర్మనీయునికి కుస్తీవిద్య నేర్పినవాడునునగు జార్జి ఆయెనిస్కోగారి నిర్వాహణక్రింద “ఆలిండియా ప్రొఫెషనల్ ఇంటర్నేషనల్ టోర్నమెంట్ ఫార్ ది ఛాంపియన్‌షిప్ ఆఫ్ ఇండియా ౧౯౩౭” అనుపేర నానాదేశములు పాల్గొనదగిన ఒకకుస్తీపోటి జరుపబడుచున్నది. ఈకుస్తీలో యూరపుఖండములోను, సమీపప్రాచ్యఖండమునను వివిధదేశములనుండి ౨౫ మంది మొదలుకొని ౩౦ మందివరకు పోటీలో పాల్గొనుచున్నారు. మూడు బహుమతులేర్పరచబడినవి. మొదటిది రూ ౧౦ వేలు, రెండవది రూ ౫ వేలు, మూడవది రూ ౨ వేల ౫ వందలు. ఇవిగాక బంగారు వెండికప్పులు బహుమతులొసంగబడనున్నవి.

విదేశములనుండి వచ్చువారిలో జర్మనీ ఛాంపియన్ అగు ఆరెల్‌గారును, బల్గేరియా ఛాంపియను అగు ఇసెంగారును, ఫ్రాన్సుదేశపు ఛాంపియను అగు విననోఫ్ గారును, హంగరిదేశపు ఛాంపియనుఅగు రిగోలాట్ గారును, ఇటలీదేశపు ఛాంపియను అగు జెలుదూ గారును, మొరాకో మొ. హెమ్లెట్ ను డి వచ్చు పోటీదారులును, పోలెండునుండి వయడెక్ గాజదిస్కీ (గామాగారిచే ఓడించబడినవాని అన్న) గారును, టర్కీనుండి రజాబేగారును, స్కాట్లెండునుండి గోల్డుస్టీన్ గారును నున్నారు.

బొంబాయిలో కుస్తీలపోటీ పూర్తియైన తర్వాత, భారతదేశములో దూరస్థలములలో నుండు కుస్తీయోధులను సవాలుచేయుటకై ఇతరప్రదేశములలోకూడ అట్టిపోటీల నేర్పరచవలెనని సంకల్పముగలదు.

ఈపోటీ ఖద్దికాలములో విశ్రాంతిగైకొనబోవుచున్న గామాగారికి సవాలుగా కనపడుచున్నది, గామా ఈపోటీలో పాల్గొని ప్రపంచమునకంతయు తానే “కుస్తీఛాంపియను”

గామాగారు

అను ప్రతిష్ఠను నిలపుకొనవలసి యుండును మరియు ఇతర భారతీయ కుస్తీయోధులమని చెప్పుకొను వారలుకూడ ఇందు పాల్గొని తమ ప్రతిష్ఠను నిలుపుకొన వలసియుండునని చెప్పబడుచున్నది.

ఈ పోటీనేర్పరచిన వారలకు మహబూబ్ ఖాన్ అను కుస్తీనిపుణుని పేరు తెలియదు. అతడు పోయిన ఐరోపా మహాసంగ్రామమునకు పూర్వము ౧౯౦౫లో ఒక పెద్ద సర్కసుతో యూరోపయంతయు తిరిగి రష్యావరకుపోయి ఆకాలమున పేరుపొందిన కుస్తీ మేటీలనందరిని ఓడించెను. రష్యాలో హాకెన్‌స్మిడిట్ అను వతనితో పోటీలో మాత్రమే ఫలితమెటును తేలలేదు. ఆకాలమున కాండో గారి మాసపత్రికలో మహబూబ్ ఖాను గారి ప్రావీణ్యము చాల మెచ్చుకొనబడెను కాని కాండో తామొక్క కుస్తీలలోనే గాక ఇతర ఖేలనములందును ప్రపంచపు మేటియను పేరుతో భారతదేశమునకు వచ్చినపుడు మహబూబుఖాను అతనిని సవాలుచేసెను. కాని కాండో తనప్రతిష్ఠను నిల్పుకొనుటకు భ యమేక మ … ఇంకొకక్రొత్త పోటీలో పాల్గొన నక్కరలేదనిరి.

ఇపుడు బొంబాయిలో ఏర్పరచబడుచున్న పోటీలో పాల్గొనుచున్న వారలందరును ౩౦ ఏండ్ల వయస్సులోబడినవారలే.

—

## గామాకు అమెరికాసవాలు

ఆస్ట్రేలియాలో కుస్తీపోటీల ప్రోత్సాహకుడగు ‘టెడ్ థై’ గారు గామాగారికిని, న్యూయార్కు (అమెరికా) పట్టణవాస్తవ్యులగు లూయిస్ గారికిని పోటీ నేర్పరచుటకై కొలంబోమీదుగా బొంబాయికిపోయిరి. థైగారు కొంతకాలమునకు పూర్వము ౧౦౦౦౦ పౌనుల పందెముకట్టి గామాగారిని లూయిస్ గారితో పోటీకి సవాలుచేసియుండిరి. కాని అప్పుడు జవాబు రానందున ఇపుడు స్వయముగా వచ్చుచున్నాడు. థైగారు గామా ప్రపంచములో మేటియని తలచుచున్నాడు. లూయిస్ గారి సవాలును గామా శిష్యులగు హమీద్ గారు అంగీకరించినారు. డాక్టర్ లెస్ వాల్ గారితో కూడ పోటీచేయుటకు హమీద్ గారు అంగీకరించి సిద్ధముగనున్నారు.

—

Printed and Publish G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy